

విజయా వారి...

# పాతాళ భైరవి

నిర్మాతలు - నాగిరెడ్డి... చక్రపాణి.... డైరెక్టర్ - K.V. రెడ్డి, B.Sc.(Hons)

## తారాగణం

యన్. టి. రామారావు .... మాలతి, టి. జి. కమల
యస్. వి. రంగారావు .... .... లక్ష్మీకాంతం
సి. యస్. ఆర్. ... .... హేమలతా అమ్మారావ్.
రేలంగి ...... .... ... .. గిరిజ
బాలకృష్ణ ...... .... .... సురభికమల
పద్మనాభం ...... .... .... చిట్టి

## టెక్నిషియన్సు

కథ, మాటలు, పాటలు .... పింగళి నాగేంద్రరావు
సంగీతం ...... .... ... ... ఘంటసాల
ఆర్కెస్ట్రా ...... .... ...... వేణు
డాన్సు ...... .... ...... పి. కృష్ణమూర్తి
ఛాయాగ్రహణం .. .... ...... మార్కస్‌బార్ట్లే
శబ్దగ్రహణం .... .... ... ... ఎ. కృష్ణన్
తికార్డిష్ట ...... .... ... ... వి. శివరాం
ప్రాసెసింగ్ ...... .... ... యన్. సి. సేన్‌గుప్త
ఆర్టు ...... .... ... ... గోఖలే, కళాధర్
మేకప్ ...... .... హరిబాబు....పీతాంబరం
ఎడిటింగ్ ...... .... సి. పి. జంబులింగం....మణి
ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ .... చలపతిరావు - జగన్నాథం
సహాయదర్శకుడు .... ..... డి. బి. జి. తిలక్
ప్లేబాక్ పాటలు .... .... ఘంటసాల, పి. లీల, జిక్కి

దర్శకుడు :
కె. వి. రెడ్డి, బి. యస్. సి. ఆనర్సు.

★

స్టూడియో :
వాహిని

నిర్మాతలు : విజయ ప్రొడక్షన్సు లిమిటెడ్, మద్రాసు

విజయ వారి...

# పాతాళ భైరవి

కథాసంగ్రహం

విక్రమార్కుడూ, శాలివాహనుడూ మొదలైన మహావీరపురుషుల అద్భుత సాహసకథలతో చరిత్రప్రసిద్ధమైంది ఉజ్జయినీ రాజ్యం. ఆ రాజ్యాన్ని, పూర్వం, ఒక మహారాజు పరిపాలించేవాడు. ఆ రాజు సాక్షాత్తూ జనకమహారాజువంటివాడు. రాణీగారుమాత్రం, తనకు తోచిందల్లా మంచిదే అనుకునే స్వభావం గలది. సౌందర్యరాశీ, సద్గుణసంపన్నా అయిన తన కుమార్తెను తన తమ్ముడికిచ్చి చేసుకోవాలని ముచ్చటపడేది. ఇక ఆ తమ్ముయ్య, అంటే రాజకుమారి మామ, వట్టి బుద్ధిహీనుడూ, డంబాచారీ, పిరికిబంటూ, శుంఠాను. ఈ బావమరిదిని చూసి రాజుగారూ, ఈ మామను చూసి రాజకుమారీ ఎంత కంటకం కలిగినా, రాణినిచూసి నవ్వేసి ఊరుకునేవాళ్ళు. మామకుమాత్రం, రాజకుమార్తెని పెళ్ళాడాలని ఒకటేఆరాటం.

ఇక రాజుగారి ఉద్యానవనంలో తోటపనిచేసే ముసలి కాంతమ్మకు ఒక్కగాని ఒక్కకొడుకు రాముడు. కావటానికి తోటరాముడైనా, సాహస శౌర్యాలచేతా సద్గుణసంపదచేతా ఊళ్ళో భలేరాముడని పేరుగన్నాడు. కొరతలేకుండా, కథానాయకునికి ఉండవలసిన లక్షణాలన్నీ ఉన్నాయి. అంజీ అని ఒక వేడుకచెలికాడుకూడా ఉన్నాడు. ఒకనాడు రాజకుమారి వనవిహారానికి వచ్చినప్పుడు చూసి, రాముడు ఆమెను ప్రేమించాడు. ఒకసందర్భంలో రాజుగారూ, రాకుమారీకూడా, రాముని సాహసానికి ఆశ్చర్యపోయారు. తరువాత ఒకసారి, ప్రత్యేకంగా రాజకుమార్తెని ఘోర సర్పగండంనుంచి రాముడు రక్షించాడు. నాటినుంచీ పైకి చెప్పకపోయినా, రాజకుమారికూడా గాఢంగా రాముణ్ణి ప్రేమించింది.

ఇది ఇలా ఉండగా......

నేపాళదేశంలో ఒక మాంత్రికుడు తన ఉపాసనాదేవతను ప్రసన్నం చేసుకుని, ఆ దేవివల్ల ఉజ్జయినికి ఉత్తరాన మంత్రాలమర్రికింద, భూగర్భంలో, యక్షులచే నిక్షిప్తమైన పాతాళభైరవి అనే ఒక మహాశక్తి ఉందని, అది లభించినవారికి అన్నిశక్తులూ కలిగి అన్నికోర్కెలూ తీరుతాయనీ, అందుకు తనవంటి మంత్రసిద్ధునిగాని, సాహసవంతుడూ సన్మార్గుడూ అయిన ఒక యువకునిగాని, బలియివ్వాలని తెలుసుకుని, వెంటనే దుర్భిణిలో చూడగా, అందులో అతనికి మన భలేరాముడే కనుపించాడు. పాతాళభైరవి ఉజ్జయిని సమీపానేఉంది, బలికి పనికి వచ్చే యువకుడూ ఉజ్జయినిలోనే ఉన్నాడు.

ఇంకేం మన రాముణ్ణి ఎలాఅయినా పట్టుకుపోయి పాతాళభైరవికి బలియిచ్చి, ఆ శక్తిని సంపాదించుకోవాలని, తన శిష్యుని వెంటబెట్టుకుని ఆ నేపాళ మాంత్రికుడు ఉజ్జయినికి బయలుదేరాడు.

అప్పుడు ఉజ్జయినిలో జరుగుతున్న కథ ఏమంటే, కొన్నాళ్ళుగా రాకుమారి ఉద్యానవనానికి రావటంలేదు. రాముడికేం తోచలేదు. ఆ వియోగం భరించలేక, రాజకుమార్ని చూడ్డానికి ఒక అర్ధరాత్రి కోటగోడ ఎక్కి సాహసంచేసి పహరాలన్నీ తప్పించుకుని అంతఃపురంలోకి వెళ్ళాడు. రాజకుమారి ఇతన్నిచూసి గాబరాపడి "ఇలా రావచ్చా! మా వాళ్ళుచూస్తే అంతఃపురద్రోహం అని నిన్ను ఉరితీయిస్తారు. వెళ్ళిపో" అని బ్రతిమాలింది. అంటే "నీ ప్రేమలేని బ్రతుకెందుకు? పోనీ ఉరిశిక్షవేయించుకుని హాయిగా పోతా" నన్నాడు రాముడు. "అయితే సరే నిన్ను ప్రేమించానని చెవుతున్నాను. ఇప్పటికి వెళ్ళిపో" అని రాజకుమారి రాముణ్ణి పంపివేసింది. కాని, ఎప్పుడూ రాజకుమారి వరిగావులనే పడికాపులుపడి ఉండేమామ, ఇదిచూసి గోలచేసి రాముణ్ణి భటులచేత పట్టించి, రాజుగారి కొప్పగించి ఉరిశిక్షవేయించాడు. పాపం అప్పుడు, రాజకుమారి, తండ్రికాళ్ళమీద పడి "నన్నొకమాటు పోయి

నుంచి తప్పించాడు, ఇతన్నిమాటికి రక్షించండి" అని బ్రతిమాలింది. సత్యకాలపు మనిషేమో రాజుగారు సంగతంతా గ్రహించి "ఓయి తోట రాముడూ! రాజకుమార్ని ప్రేమించగానే సరికాదు. నీకేం ధనకనకవస్తు వాహనాలున్నాయా? నీవంత శ్రీమంతుడవై వచ్చినప్పుడు నా కుమార్తె నడుగు. అందాకా ఈ వైపుల కనుపించావా నీ తల తీయిస్తా పో" అని రాముణ్ణి విడిచిపెట్టేశాడు.

ఈ రాముణ్ణే పట్టుకుపోయి పాతాళభైరవికి బలియివ్వాలని ఉజ్జయినికి వచ్చిన నేపాళ మాంత్రికుడు, అప్పుడే సత్రంలోచేరి, చుట్టూ జనాన్ని చేర్చుకుని, తన మంత్రశక్తిచేత ఒక వింతప్రదర్శనం చేస్తున్నాడు. ఒక అక్షయఘటంలోంచితీసి ఎవరేంకావాలంటే అదల్లా అందరికీ పంచి పెడుతున్నాడు. సువర్ణాలుకూడా ఇస్తున్నాడు. రాము దిదంతాచూసి ఇంకేం ఈ అక్షయఘటం ఒక్కటుంటే చాలు కోరినవన్నీ వస్తాయని ఒడుపేసి, మాంత్రికుని చేతిలోంచి ఆ ఘటాన్ని గుంజుకుని దౌడుతీశాడు. వెంటనే మాంత్రికుడు, తను వచ్చేదాకా ఈ సత్రంలోనే ఉండమని శిష్యుడికి చెప్పి రాముడివెంటపడ్డాడు. మాంత్రికుడు ఊరిబైట రాముణ్ణి కలుసుకుని "ఓరి డింభకా, అందులో ఏముంది? అంతా నా మంత్రశక్తి. నీవు రాజకుమార్ని ప్రేమించి రాజుగారడిగిన ధనకనకవస్తువాహనాల కోసం చూస్తున్నావుకదా? నావెంట రా. నీ కా అయిశ్వర్యం పట్టిస్తా"నని చెప్పగా, ఆ మోసగాణ్ణే నమ్ముకుని రాము దతనివెంట బయలుదేరాడు.

రాజకుమారి లభిస్తుందికదా అని, మాంత్రికుడు మంత్రాల మర్రి కింద మంటల్లో దూకమన్నా దూకి, బొడ్డుదేవర్ని పగులగొట్టి కత్తుల ద్వారంలో తల దూర్చమన్నా దూర్చి, రాముడు తన సాహసకార్యాలచేత గుహలోకి మార్గంచేయగా, ఉభయులూ పాతాళభైరవి సన్నిధికి చేరారు. అక్కడ....చీకటిపుష్కరిణిలో స్నానం చేస్తూ ఉండగా రాముణ్ణి ఒక మొసలి పట్టుకుంది. ఘోరయుద్ధంచేసి రాముడు దాన్ని చంపివేయగా ఆ మొసలికి శాపంపోయి అది దివ్యాంగనయై నిలిచి మాంత్రికుని మోసమంతా రాముడికి చెప్పి మాయమైంది. ఇక మన రాముడు ఉపాయంగా

ఆ మాంత్రికుణ్ణే దేవికి బలియిచ్చాడు. వెంటనే పాతాళభైరవి, పట్టరాని సంతోషంతో అట్టహాసంగా ప్రత్యక్షమై రాముడికి తన ప్రతిమనిచ్చి "ఇది నా శక్తి. నన్ను ధ్యానించి ఈ ప్రతిమ నెవరు చేపట్టినా, వారికల్లా నేను ప్రత్యక్షమై వారి అభీష్టాలు నెరవేరుస్తాను. జాగ్రత్త" అని హెచ్చరించి అంతర్ధానమైంది.

ఆ దివ్యశక్తి ప్రభావంతో రాము ఉంటికివచ్చి, తన పాతగుడిసెస్థానే రాజమందిరంకన్నా సుందరమైన ఒక మాయామహల్ నిర్మించుకుని, రాజుగారికి వెలలేని కానుకలు పంపి, తన మహల్‌కి ఆహ్వానించాడు. రాజుగారు సకుటుంబంగా వచ్చి రాముడి ఐశ్వర్యంచూసి అబ్బురపడి, తన మాటప్రకారం అతనికి తన కుమార్తెనిచ్చి వివాహమహోత్సవం చేయటానికి ముహూర్తం నిశ్చయించాడు.

ఈ వార్త విని సత్రంలోఉన్న మాంత్రికుని శిష్యుడు, దుర్భిణిలో తన గురువుగారి అవస్థచూసి తక్షణం గుహలోకిపోయి, తలనూ మొండాన్నీ చేర్చి సంజీవిని ప్రయోగించగా మాంత్రికుడు బ్రతికి, సంగతంతా తెలుసుకుని, రాముడిదగ్గరఉన్న పాతాళభైరవిని సంగ్రహించటానికి బయలుదేరాడు. అలా వస్తూఉండగా రాజకుమారి మామ ఊరి బయట ఉరివేసుకుంటూ మాంత్రికునికి కనుపించాడు. వెంటనే ఆపి, "ఇదేమిరా ఏల చస్తున్నా"వని అడుగగా "నాకివ్వకుండా రాజకుమార్తె నేట రాముడికిచ్చి పెళ్ళిచేస్తున్నారు. నేను చస్తా"నని ఏడ్చాడు మామ. "చావవద్దు. నేను చెప్పినట్లుచెయ్యి, రాజకుమార్తె నేను నీకిప్పిస్తా" నని చెప్పి, మాంత్రికుడు అక్కణ్ణుంచే దుర్భిణిలో చూసి, మాయా మహల్లో పూజాగృహంలో మందసంలోఉన్న పాతాళభైరవి ప్రతిమను రహస్యంగా తనకు తెచ్చి ఇయ్యమన్నాడు. ఓస్! ఇంతేనా, ఇప్పుడే తెస్తానని మామ మాయామహల్‌కి వచ్చి, అంతా పెళ్ళిసందడిలోఉండగా రహస్యంగా ఆ ప్రతిమను తీసుకువెళ్ళి మాంత్రికుడికి ఇచ్చాడు.

మాంత్రికుడు వెంటనే పాతాళభైరవిని ప్రత్యక్షంచేసుకుని, తన మాతన శిష్యుని రాజకుమారితోసహా మాయామహల్ని తనదేశంలో తన యింటికి చేర్చమన్నాడు. అంతే; ఆ పాతాళభైరవి ప్రభావంవల్ల అంతా ఆ మామ కళ్ళముందే మాయమైపోయారు.

ఉన్నవాళ్ళంతా ఉన్నట్లేఉంది, రాజకుమారి మాయామహల్ మాయంకాగానే అంతా గొల్లుమన్నారు. ఇంతలో మామ బావురుమని ఏడుస్తూవచ్చి, మాంత్రికుడు తనని మోసంచేసి రాజకుమార్ని ఎత్తుకు పోయాడని చెప్పాడు. రాజుగారు ఏమిటి ఇంద్రజాలమంతా అని నిక్కదీసి అడగ్గా, రాముడు నిజమంతా పూసగుచ్చినట్లు చెప్పాడు. అప్పుడు రాజుగారు చాలా విచక్షణకలవాడు గనుక, "నాయనా! నీవు అదృష్ట వంతుడివి. నీవే సాధించుకురాగలవు. కనుక వెళ్ళి నా కుమార్తెను రక్షించి తీసుకురా" అని రాముణ్ణి దీవించి పంపించాడు. ఈ మాటు వేడుకచెలికాడైన అంజి "నేను నీవెంట ఉండవలసిందే" అని రాముడితోకూడా వెళ్ళాడు.

అలా, రాముడూ అంజీ ఎక్కడికి వెళ్ళాలో తెలియక కానలనక, కోనలనక, తిరిగితిరిగి ఒక అడివిలో అలిసిపోయి నిద్రపోయారు.

మాంత్రికుడు ఎత్తుకుపోయిన రాజకుమారి, నిర్మానుష్యమైన కొండలమధ్య, ఆ మాయామహల్లోనే, పాపం అశోకవనంలోఉన్న సీతలా పడిఉంది.

తనను ప్రేమించి తనవశ్యంకమ్మని మాంత్రికుడు నిత్యం రాజ కుమార్ని బలవంతపెడుతున్నాడు. రాజకుమారి నిరాకరిస్తోంది. చివరికి మాంత్రికుడికి కోపంవచ్చి "నీవింకా ఆ రాముణ్ణి ప్రేమిస్తున్నావా? చూడు వాణ్ణించేస్తానో" అని, పాతాళభైరవి ప్రభావంతో, అడివిలో నిద్రపోతూన్న రాముణ్ణి, నవనాడులూ కట్టి అక్కడికి తెప్పించి...." ఈ రాత్రి గడువిస్తు న్నాను. నన్ను ప్రేమించి పెళ్ళాడితే సరి, లేదా వీణ్ణి తెల్లవారకముందే

దేవికి బలియిస్తా"నని, రాజకుమారికి ఆఖరిమాటగా చెప్పి, రాముణ్ణి ఒక గుహలో బంధించి, అక్కడ తన శిష్యుని కాపుపెట్టాడు.

ఇక అడవిలో నిద్రపోతున్న అంజి మేల్కొని, మిత్రుణ్ణి కానక, అడవంతా తిరుగుతూ, ఒకచోట అదృష్టం కలిసివచ్చి, రెండు భూతాల్ని వంచించి, మాయ చెప్పులూ, మాయ శాలువా సంపాదించగలిగాడు. ఆ చెప్పులు తొడుక్కొని ఎక్కడ ఉండాలనుకుంటే క్షణంలో అక్కడ ఉంటారు. ఆ శాలువ కప్పుకుంటే ఎవరికీ కనుపించరు.

ఇంకేం, అంజి ఆ చెప్పులు తొడుక్కొని, ఆ శాలువ కప్పుకుని, రాముడు బంధింపబడిఉన్న గుహలోకి, ఎవరికీ కనిపించకుండావచ్చి వ్రాలాడు. వెంటనే అక్కడ కాపున్న మాంత్రికుని శిష్యుణ్ణి మూర్ఛపోయే టట్టు కొట్టి, రాముడి కట్లు ఊడదీసి, తానుతెచ్చిన మాయ చెప్పులూ, శాలువా ఇచ్చి, రాజకుమార్ని రక్షించటాని కతన్ని పంపించి, తాను మాంత్రికుడి శిష్యుని బురఖా వేసుకుని, మాంత్రికుణ్ణి వెతుక్కుంటూ బయలుదేరాడు.

మాయ చెప్పులూ మాయ శాలువ సహాయంతో రాము డెవరికీ కనుపించకుండా రాజకుమారి నిర్బంధంలోఉన్న గదిలో ప్రవేశించాడు. ఆ సమయాన గత్యంతరంలేక రాజకుమారి పాపం ఆత్మహత్య చేసుకో బోతోంది. వెంటనే రాముడు, రాజకుమారికి కనుపించి, నివారించి సంగతంతా వివరించి మాయ చెప్పులూ మాయ శాలువా రాజకుమారి కిచ్చి తల్లిదండ్రులదగ్గరికి వెళ్ళిపొమ్మన్నాడు. "అమ్మో! నిన్నిలా అపాయంలో విడిచిపెట్టి నే వెళతానా?" అని రాజకుమారి అంటే, "అయితే ఈ శాలువ కప్పుకుని ఎవరికీ కనిపించకుండా ఇక్కడే ఉండు. నేను మాంత్రికుణ్ణి ఎలాచంపుతానో చూడ"మని చెప్పి, కీచకుణ్ణి చంపటానికి భీముడు పొంచిఉన్నమాదిరిగా, రాముడు రాజకుమారిస్థానే మంచంమీద దుప్పటి ముసుగుపెట్టి పడుకున్నాడు.

సమయానికి అంజి చేసిన ఘనకార్యమేమంటే, మాంత్రికుని శక్తు లన్నీ వాని గడంలోనేఉన్నాయి, అది తీయిస్తే వాని శక్తులుపోతాయి

కనక, "సర్వశక్తుల్నిమించిన పాతాళభైరవే ఉండగా, ఇంకా యీ గడ్డం ఎందుకు? ఈ గడ్డంలేకపోతే మీరు చాలా అందంగా కనిపిస్తారు. రాజకుమారి చప్పున వరిస్తుంది" అని చెప్పి మాంత్రికుణ్ణి నమ్మించాడు. ఈ యుక్తి నచ్చి, మాంత్రికుడు గడ్డంతీసివేసి నున్నగా క్షవరమై, "ఇప్పుడు నా అందం చూడు" మంటూ రాజకుమారి గదిలోకివచ్చాడు.

ఇంతేముంది, అదేసమయాన, గుహలో మూర్ఛపోయిన అసలు సిమ్మాడు మూర్ఛదేరి, "మౌనం, గురో!" అంటూ అక్కడికి పరుగెత్తుకు రావటం, వెంటనే చివాలునలేచి రాముడు, ప్రత్యక్షంకావటం - చూసే టప్పటికి మాంత్రికుడు గంగవెఱ్ఱులెత్తి పాతాళభైరవి ప్రతిమను తీసి చేతపట్టుకుని హుంకరించాడు. వెంటనే రాముడు మాంత్రికు డొకచోట వానిచేతిలోని ప్రతిమ ఒకచోటా పడేటట్టు కొట్టి, మాంత్రికునితో తల పడ్డాడు. అంజి ఆ ప్రతిమను తీసుకుని పాతాళభైరవిని ధ్యానించి, అహాళాన అందరితోసహా మాయామహల్ని ఎప్పటిఅట్లు ఉజ్జయినిలో చేర్చుమని కోరాడు. ఈలోగా రాముడు పారిపోబోతున్న మాంత్రికుడికి కత్తినెదిరించి ఘోరాతిఘోరంగా ధర్మయుద్ధంచేసి, ఆ పాతకుణ్ణి మళ్ళీ లేవకుండా చిత్రవధ చేశాడు.

మాయామహల్ ఉజ్జయినిలో యథాస్థానాన వచ్చి వెలసింది. అది చూడగానే రాజు రాణి అంతా, మాయామహల్లోకి వెళ్ళి రాజకుమారి సురక్షితంగా వచ్చినందుకు సంతోషించి, రాముణ్ణి మెచ్చుకున్నారు. ఈమాటు మామకూడా రాజకుమార్ని రాముడికే ఇచ్చి పెళ్ళిచెయ్యాలని సంబరపడ్డాడు. ఎంతోవైభవంగా రాముడికీ రాజకుమారికీ కళ్యాణ మహోత్సవం జరిగింది.

మంగళం




ఇందుమతి (రాజకుమారి) చెలికత్తెలు

పల్లవి : తీయని ఊహలు, హాయిని గొలిపే
వసంతగానమె హాయీ
వసంతనాట్యమె హాయ్ హాయ్ ॥ తీయ ॥

ఇందు : చివురులదాగి - తీవెల నూగి
పూవులు ఘుమఘుమ నవ్వగా
వనియంతా పరిమళించెనే
మనసెంతో - పరవశించెనే ॥ తీయ ॥

ఇందు : గిలిగింతల చెతలాడి
చిరుగాలి సరాగము సేయుగా
వనియంతా ఝల్ఝులించెనే
తనువెంతో పులకరించెనే.... ॥ తీయ ॥

ఇందు : క్రొత్తరాగమున కుహూ, కుహూ యని
మత్తిలి కోయిల కూయగా
వనియంతా రవళించెనే
నన్నెంతో మురిపించేనే. ॥ తీయ ॥

వారిణి

అతిహాసం విన్నారా - ఆ
అతిసాహసులే ఉన్నారా
హెచ్చరికో - హెచ్చరిక - హై
హెచ్చరికో - హెచ్చరిక
యుగాల నిధులు అందరివండి
ప్రక్షిప్తాలవి పాతాళంలో
శక్తి వుంటవి........లక్షశక్తులా
దక్షసాహసికి దక్కేనండోయ్ ॥ అతి ॥
జగతి సాహసమె జయకథ కాగా
యుగయుగానికొక కథానాయకుడు
జగన్మంగళము సాధించేనూ
ప్రకల్పమణిగా వెలిగేనూ.... ॥ అతి ॥
శూలాగ్రానికి సూటిగ గురియై
ప్రేలిన సాహస విక్రమార్కుడు
మట్టిబొమ్మలను మహారణానికి
జట్టునడిపినా శాలివాహనుడు ॥ హెచ్చ ॥
విజయసాధనల వింతకథలతో
ఉజ్జయినీపురి నుజ్వలించిరే ॥ హెచ్చ ॥
నాటివారివలె నేటివారునూ
చాటగలరయా సాహసమంటూ
ఘాటుఘాటుగా కథ నడిపింపగ
నేటికెవడు మరి కథానాయకుడు.

నీవా.......నీవా.........నీవా

## ఇందుమతి—రాముడు

ఇందు : కలవరమాయే మదిలో, నా మదిలో
కన్నులలోన కలలే ఆయే
మనసే ప్రేమమందిరమాయె ॥ కల ॥

రాము : కలవరమాయే - మదిలో, నా మదిలో
కన్నులలోన గారడి ఆయె
మనసే పూలమంటపమాయె ॥ కల ॥

ఇందు : నాలో యేమో, నవభావనగా
మెల్లన వీణ మ్రోగిందీ
అనురాగాలే - ఆలాపనగా
మనసున కోయిల కూసె ॥ కల ॥

రాము : నాలో యేమో, నవరసరాగం
పిల్లనగ్రోవి ఊదిందీ
మోహాలేవో మోసులువేసి
ఊహాగానము చేసె
కలవరమాయే మదిలో, నా మదిలో.

ఇందు : కన్నులలోన కలలే ఆయె
మనసే ప్రేమమందిరమాయె
కలవరమాయె మదిలో, నా మదిలో.

రాము : కలవరమాయె మదిలో, నా మదిలో

## ఇందుమతి — రాముడు

ఇందు : ఎంత హాటు ప్రేమయో ఎంత తీవ్ర వీక్షణమో ॥ ఎంత ॥
కన్ను కాటు తిన్నదిగా కళలు విరిసెనే.......
నా....మనసు మురిసెనే
ఎంత హాటు ప్రేమయో.......

రాము ఎంత లేత వలపులో ఎంత చాటు మోహములో ॥ ఎంత ॥
కన్నులలో కనినంతనె తెలిసిపోయెనె
నా....మనసు నిలిచెనే ॥ ఎంత ॥

ఇందు : ఈ జాబిలి....యీ వెన్నెల ఈ మలయానిలమూ
విరహములో వివరాలను విప్పిచెప్పెనె.... ॥ఎంత హాటు॥

రాము ఓ జాబిలి ఓ వెన్నెల ఓ మలయానిలమా
ప్రియురాలికి, విరహాగ్నిని పంపుసేయరే ॥ఎంత లేత వలపు॥

## మామ

వినవే బాలా - నా ప్రేమగోలా
నిను కను వేళా నిలువగజాలా ॥ వినవే ॥
గుబుల్ గుబుల్ గా - గుండెలదరగా
దిగుల్ దిగుల్ గా - యిది యిదిగా ॥ వినవే ॥
చిరునవ్వు చాలే - చిత్తైపోతానే
మురిపెంతె చాలే - మూర్ఛపోతానే ॥ వినవే ॥
తోడు గూడి తోడిరాగం పాడుకొంటూ మేడమీదా
హైదిబంగార్-తూగుటుయ్యాల్ వేదుకలరా-ఊగరాదా
తెట్టాపట్టల్ ఆటకోలాటం తొక్కుడుబిళ్లా ఆడే నాతో
తొక్కుడుబిళ్లా ఆడే నాతో.......

## డాన్సు పాట

నగలోయ్ నగలూ, తళుకు బెళుకు నగలూ
బావలూ, మామలూ, బావలు మామలు, భామలూ
లాలలా, లలలా, లలలు, లలలు, లలలా లలలా....

సింగారి వీధంట మామ సంగెళి పిల్లంట బావ
కొంగు తాకిందంటి....హై - హై
కొంగు తాకిందంటి....కుయ్ కుయ్ కుయిలే

నీవెంట వస్తాము - ఊఁ నీ జంట ఉంటాము - ఊఁ
సైఁయంటి బావా ఊఁ అంటి మామా
చెలియని, భళియని, పరేయని, చెలామణి

మీతంత నావెంట, గుమిగుమి, గుమిలే
లలలా, లలలా, లలలు, లలలు, లలిలా
నగలోయ్ నగలు, తళుకు బెళుకు నగలూ

## ఇందుమతి — రాముడు

రాముడు: ప్రణయ జీవులకు దేవివరాలే
కానుక లివియే...ప్రియురాలా
హాయిగా....మనకింకా స్వేచ్ఛగా....హాయిగా

ఇందు: చెలిమినించు పాటలా విలాసమైన ఆటలా....
కలసి మెలసి పోదమోయ్ వలపుబాటలా.... ॥ హాయి ॥

రాము: నీ వలపూ, నా వలపూ పూలమాలగా
నీవు నేను విడివడని ప్రేమమాలగా ॥ హాయి ॥

ఇందు: కలలె నిజముకాగ, కలకాలమొకటిగా
తెలియరాని సుఖములలో తేలిపోవగా ॥ హాయి ॥

## నేపథ్యం

పల్లవి : ప్రేమకోసమై వలలో పడెనే, పాపం
పసివాడు....అయ్యో పాపం పసివాడు

చ ॥ వేమరుదేవుల వేడుకొని, తన కొమరుని క్షేమం కోరుకొని
ఏమైనాడో - ఏమగునో యని కుమిలే తల్లిని కుములుమని
ప్రేమకన్ననూ పెన్నిధి యేమని యేమి ధనాలిక తెచ్చునని
భ్రమసిపోవు ఆ రాజకుమారిని
నిముసమె యుగముగ గడుపుమని ॥ ప్రేమ ॥
ప్రేమలు దక్కని బ్రతుకేలాయని ఆ మాయావిని నమ్ముకొని
ఏమి వ్రాసెనో....అటు కానిమ్మని బ్రహ్మదేవునిదె భారమని

## రాముడు

పల్లవి: కనుగొనగలనో లేనో ప్రాణముతో సఖిని

చ ॥ పెండ్లిపీటపై ప్రియ నెడబాసి గాలిమేడలా గారడికాగా
కలకాలమును కర్మను దూరుచు కలగా బ్రతకడమేనో ॥క॥
వెదకి వెదకి ఏ జాడ తెలియక హృదయమంతా చీకటిగా
ఎంత పిలిచినా పిలుపే అందక చింతిలి తిరగడమేనో ॥క॥
పులివాతను బడు బాలహరిణియై చెలి ఎచ్చటనో చెరపడగా....
జాలిలేని ఆ మాయదారికే బలిగా చేయడమేనో ॥క॥

PRINTED AT THE S. N. K. PRESS, MADRAS

6/51



విజయా వారి...

# చంద్రహారం

డైరక్షన్

K. కామేశ్వరరావు. B.A.



నిర్వహణ - నాగిరెడ్డి... చక్రపాణి...